Registered No. M-4345

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ జూ॥ నెల 5 వ తేది శుక్రవారం [నె 22 రు.

## జపాను చలవ.

### (జపానుకి త్యాంక్సు.)

" భారతీయ ప్రజలను శత్రువులుగ నెంచుట జపాను ఉద్దేశంకాదు "

జపాను ప్రధాని—జనరలు టోజోగారు పలుకులివి.

జపాను చలవవల్లనే — హాంగుకాంగు, మలయ, బర్మాలందు భారతీయ సిపాయీలు చంపబడుట, ఖైదీలగుట అవమానింపబడుట జరిగింది.

జపాను చలవవల్లనే — స్టీమరులు హెచ్చరికలేకుండ ముంచివేయబడినపుడు భారతీయ నావికులు నడి సముద్రాలలో మునిగిపోయిరి.

జపాను చలవవల్లనే — రంగూను, కొలంబో, ట్రినిడాడు, కాకినాడ, విశాఖపట్నము లందు సివిలు ప్రజలు చంపబడిరి.

జపాను చలవవల్లనే — భారతదేశంలో అనాథలు వితంతువుల సంఖ్య పెరిగింది.

జపాను చలవవల్లనే — మలయాలోను, బర్మాలోను స్వయంకృషివల్ల కట్టుకొన్న యిండ్లనుండి భారతీయులు తరిమివేయబడిరి.

జపాను చలవవల్లనే — అనేక భారతీయ గృహములందు ఆందోళన బెంగ ఎక్కువ యినవి.

జపాను చలవవల్లనే — ఇండియాలో జీవితవ్యయం హెచ్చింది.

జపాను చలవవల్లనే — పేదవారికి గొప్పవారికికూడా తిండి దొరకడం కష్టమయింది.

జపాను చలవవల్లనే — ఇండియాలో రైల్వేలు, పోస్టు టెలిగ్రాములు మున్నగు సర్వీసు లకు అనేక యిక్కట్టులు కలిగినవి.

జపాను చలవవల్లనే — అనేకచోట్ల శాంతియుతమగు జీవితము భీభత్సమయ్యెను.

జపాను చలవవల్లనే — యుద్ధం ఇండియాకు చేరువయినది.

" వాళ్లు మీ బంధవిమోచన చేయడానికి వస్తున్నామంటారు—అది శుద్ధ అబద్ధము "

అని మాడం చియంగుకై షేకుగారు నుడివియుండిరి.

# బర్మానుండివచ్చు సేనకు సేనాధిపతి వావెలు సందేశము.

బర్మాలో గత కొద్ది మాసములనుండి మీరు పడుచున్న కష్టాలు నే నెరుంగుదును. మీకన్న అధిక సంఖ్యాగానున్న శత్రువుల నెదిరించి, విమానబలంకూడ అధికంనున్న శత్రువుతో, క్రొత్త సైన్యాల సహాయంలేక మీరు పోరాడిరి.

"జపానువారు తాత్కాలికంగా సముద్రంపై ఆధిపత్యం వహించి రంగూను రక్షణ అసాధ్యం చేయుటచే యిట్లయ్యెను. శత్రువులు బర్మాకు చాల ఎక్కువగ క్రొత్త సేన సరకు తేగల్గిరి. ఇండియాతో మార్గాలు సరిలేక పోయినందున మేము మీకు సహాయం పంపలేకుంటిమి.

"ఇండియాలో రక్షణలు దిట్టపరచుకొనుటకు వ్యవధి కలుగజేయుటకై, విశేషంగానున్న జపాను సేనలను, బర్మాలో మీరు అనేక కష్టములకోర్చి ఎదిరించుచుండిరి.

"మీరొనర్చిన ఘన కార్యమునకు నేను కృతజ్ఞత తెల్పుచున్నాను. ఓర్పు ధైర్యములతో మీరు నష్టాలు భరించినందుకు సంతసము మీ రిపుకు మంచి అనుభవమగడించిరి. విశ్రాంతి గైకొని క్రొత్తగ తయారుబొంది సామానులు నింపుకున్నాక, యింతకన్న అనుకూలమైన పరిస్థితులలో శత్రువు నెదుర్కొనగలరు. సరి సమానమయిన పరిస్థితులలో మీరా శత్రువుని తప్పక ఓడింపగలరను నమ్మకం మీకూ నాకు గూడ గలదు."

అని భారతీయ సర్వ సేనాధిపతి జనరలు వావెలుగారు బర్మానుండి మరలివచ్చిన సేనలకు సందేశమంపిరి.

ఇండియా దాడి నిలిచింది.

బర్మా సేనాధిపతియగు జనరలు గౌ॥ సర్ అలగ్జాండరుగారు యిట్లు ప్రకటించిరి :—

"బర్మానుండి సైన్యాన్ని ఆ దేశంనుండి మరలించి తెచ్చుటతో బర్మా సేనల ఆధిపత్యం నాకు తప్పిపోయింది. మేము వెనుకకు మరలుట తప్పని సరియైనప్పటికి, సామ్రాజ్య రక్షణకు యింతగ పాటుబడినందుకు యీ సేనలోని వారంతా గర్వ పడవచ్చును.

"రంగూను పడిపోయినప్పటినుండి మా సేనకు చీనా సేనకు, శత్రుసేనల నెదిరించి వారి మందుగుండంతా ఖర్చయ్యేటట్లు చేసి వారి దాడిని ఆలశ్యంచేయుటే కర్తవ్యంగానుండెను. విమాన సహాయం అట్టె లేకుండానే, విశ్రాంతిగాని కొత్త సహాయంగాని లేకుండానే యీ పని జరిగింది. యుద్ధం చాల కష్టంగానే యుండెను. కాని శత్రువు ఇండియా సరిహద్దులకు వర్షకాలంలోగా రాకుండా నిలుపగల్గితిమి. మన సేనల ధైర్య సహనములవల్లను, సేనానాయకుల నేర్పు పట్టుదలవల్లనే సేన అంటియుండ గల్గెను.

"ఈ సేనలోని జట్లన్నియును జరుగబోయే యుద్ధానికి తయారుకావాలి. చివరకు బ్రిటిషు వారికే విజయమను నమ్మకంతో వారు ధైర్యం పట్టుదలల్గి పనిచేయుమరని నేను నమ్ముచున్నాను."

---

మదరాసు వీర త్యాగం.

మదరాసు సేపర్సు మైనర్సు దళమునకుచెందిన ఆర్. కె. సన్యాసయ్య—12948 గాయపడెను.

---

# యుద్ధ విమర్శ.

చీనాలో స్థితి.

జపాను అమెరికాపై యుద్ధం ప్రకటించు నాటికి చీనాలోని పరిశ్రామిక నగారాలను, ముఖ్యమగు నీటి మార్గములను రైలు మార్గములను జపాను వశపరచుకొనియుండెను. చీనాలో సారవంతమగు ప్రదేశం జపాను ఆధీనమునందుండెను. చకియాంగు-కియాంగ్సి రైలు మార్గం మాత్రం శత్రువశం కాలేదు. చకియాంగు రాష్ట్రం చుంగుకింగు

ప్రభుత్వమునకు వినయ విధేయతలు కలిగియుండినది. అచట శత్రువుకి కనబడని విమానాశ్రయము లనేకం గలవు. చీనాకు యితర ప్రపంచంతో సంబంధం లేకుండా చేసేమని జపాను రేడియో ప్రగల్భాలు చెబుతున్నా చుంగ్‌కింగు ప్రభుత్వానికి బయటనుండి సప్లైలు అందుచునే యున్నవి. అందుచే చెకియాంగునందు జపాను 100,000 సేనను దించి, దాన్ని పూర్తిగ వశపరచుకొన జూచుచున్నది.

చీనాలో పలుతావులందు శత్రువు కాలూనినట్లు తెలియుచున్నది. షాంషి రాష్ట్రంలో ఫెనునదీ మార్గాన్న హోనానులోనికి వచ్చిరి. టీంస్టిను-హాంకో రైలుమార్గంద్వారా హూపేవరకు జపాను వారు రాదలచిరి. కాని చీనా గోరిల్లా సైనికులు వారికి చాల నిరోధం కలిగించుచున్నారు. జపాను సైనికులు క్రొత్తగ వేసిన రైలుమార్గాలు ఒక్క రోజులో మాయమవుతున్నాయి. జపానువారు కాంటను-హాంకో రైలు మార్గాన్న హాంకో వరకు సేనను దింప జూచుచున్నారు. ఇదంతా చూస్తే చాంగ్షా-హాంకోల మధ్య ఎచటనో తీవ్ర యుద్ధం జరుగగలదు. చీనా దేశంలో నైరుతి భాగం సారవంతమయినదని వశపరచుకోవాలని జపాను ఎత్తు.

అంతేకాక యునాను రాష్ట్రం పైనుండి మన దృష్టిని మరల్చుటకుగూడ యితర చోట్ల సేనను దింపవచ్చును.

ఎట్లైనను చీనాలోగూడ పెద్ద ఎత్తున యుద్ధం సాగించుటకే జపాను తీవ్ర కృషిచేయుచున్నదనవచ్చును.

ఐదు సంవత్సరాలు యుద్ధంచేసిన పిమ్మటగూడ ఇన్ని వైపుల శత్రువు నెదుర్కొనుచున్న చీనా సేనల ధైర్యం కొనియాడ తగింది. చైనీయుల ఉత్సాహానికి కొరతలేదు, వారి సేనలకు ధైర్యానికి తెంపులేదు.

బర్మాలో కొద్దికాలం అనుభవించిన విమానాధిక్యతను మిత్రమండలి సేనలు ఎట్లు గోల్పోయినవో విమానదళాధికారులు క్లుప్తంగా ప్రకటించిరి.

బర్మా పతనానంతరం.

నేల సైన్యాలకు వలెనే విమానదళానికిగూడ రంగూను పతనమే దశ త్రిప్పేసింది. సిట్టాంగునదివద్ద జపాను వారు నిజమయిన గెలుపు పొందిరి. దానితో యుద్ధక్రమం మారిపోయి రంగూను పడిపోక తప్పిందికాదు, ముఖ్య పట్నమగు రంగూను దాడి రక్షణయందు బాగా పనిచేసినా, మన విమానదళం శత్రు శిబిరాలపై దాడిచేయుటకు తగిన సత్తువ కలిగియుండలేదు. రంగూను నుండి దక్షిణ బర్మానుండి మరలి వచ్చుటచేత మన విమానాలుగూడ, బాగా కట్టబడిన విమానాశ్రయాలను విడచి తొందరగ కట్టబడిన మధ్య బర్మా విమానాశ్రయాలకు రావలసివచ్చింది. వదలిన మంచి ఆశ్రయాలను శత్రువు వశపరచుకొనెను.

ఇంకో విషయమేమంటే, శత్రువులకు యితర రంగాలలో యుద్ధాలు ముగియగానే అచటి విమాన సహాయం క్రొత్తగ చేకూరెను. అంతేకాక ఇండియాకు ప్రమాదం ఎక్కువగు కొలది, బ్రిటను అమెరికాలనుండి వచ్చిన క్రొత్త సామగ్రి బర్మాకు పంపుటకు వీలయింది కాదు.

ఇండియా రక్షణ.

"బర్మాలోని సేనలు ఇండియాను మహోపద్రవంనుండి తప్పించినవి. మనం తయారుగా లేనపుడు అమాంతంగా శత్రువు మనమీద పడే ఉపద్రవముండెను" అని జనరలు వావెలు గారు మే 28 వ తేదిన నుడివిరి.

ఇపుడెంతవరకు మనం సిద్ధంగానున్నాము? ఆ విషయంకూడా వావెలు దాచకుండా చెప్పెను. "ఇండియాకు ప్రత్యక్షంగా ముప్పు సూచింపబడుచున్నది. మన రక్షణలకై కృషిచేయుచున్నాము" అని అతడనెను. ఇండియా రక్షణ చేయ అమెరికా స్థిరసంకల్పం కల్గియుంది. ఇంగ్లాండు అవతల రష్యాకు, ఆఫ్రికా ప్రాంతములకు ఆయుధాలు పంపవలసియున్నాగూడ, ఇండియాకు విమాన విధ్వంసక ఫిరంగులను చాల పంపెనని వావెలుగారు తెలిపిరి.

కలకత్తా సింహళముల విమాన దాడి రక్షణ యేర్పాటులుగూడ సింగపూరును మించియున్నవి.

"మనం అన్నింటికన్న ఎక్కువగ అనుభవం గడించితిమి. బర్మానుండి వచ్చిన సేనలకు జపానువారితో యుద్ధం ఎట్లు చేయడమో బాగా

తెలిసింది, వారి అనుభవం నాయకత్వం ఇండియాయొక్క ఈశాన్యపు అడవి సరిహద్దుల రక్షణకేగాక, తిరుగు దాడులుచేయుటకు తయారగు భారతీయ సేనకు ప్రాతిపదికంగా నుండగలవు.

**విచిత్రమైన వదంతులు.**

ఇండియాలో ప్రచారమగుచున్న కొన్ని విచిత్రమగు వదంతులు ఎక్కడ ప్రారంభించినవో పరిశోధించి చూడగ యిట్లు తెలిసెను. నిండు జనాభాగల నగరంపై శత్రువు ఫలానానాడు బాంబులు వేస్తాడన్న వదంతి ప్రబలుతుంది. ఆ వూరులోనే యుండు గృహస్తులు, తమ బంధువులు తమపై దిగిపోకుండా యిటువంటి వదంతులు కల్పించారని తెలియవచ్చెను. శత్రువులును వాటాల వ్యాపారస్తులు కొందరును మీ మిత్రులనబడేవారే కొందరును యీ వదంతులను వ్యాపింపజేయుదురు. జాగ్రత్త.

ఇంకోవదంతి వ్యాపించియున్న దేమంటే, జపానువారు తామాక్రమించిన దేశాలలో ముఖ్యంగా భారతీయులను అతి మర్యాదగ చూస్తున్నారని. ఇట్టి అబద్ధాలు జపాను రేడియోలో పుడతాయి. లేదా ఆ దేశాలనుండి పారివచ్చినవారే చెప్పుచుందురు. అంత మంచిగా జపానువారు చూస్తూవుంటే ఆదేశంనుండి యితడేల పారిపోవాలి.

**జర్మనీ దేశంలో అస తృప్తి**

రష్యాపైని లిబియాపైని జర్మనీ క్రొత్త దాడులు ప్రారంభించినప్పటికి జర్మనీలో ప్రజలు సంతృప్తి చెందలేరు. నిరిటికన్న అధ్వాన్నస్థితిలోనున్నారు. ఏడాదిక్రిందట జర్మనీ యూరోపు నైరుతి భాగంలో విజయంపొంది ఆ విజయభేరీతో రష్యాదాడి ప్రారంభించెను. ఇపుడు చాల నష్టపోయి, చలికాలంలో చాల బాధపడియున్నది. అపుడు ప్రజలు త్వరగా గెలుస్తామనుకున్నారు— ఇపుడా భ్రమ పోయింది. పోయిన సిపాయీలు తిరిగివస్తారో లేదో సందేహంగానుంది. హిట్లరుయందు విశ్వాసముంది కాని నిరిటంతలేదు. యుద్ధం దీర్ఘకాలం కొనసాగినకొలది జర్మను ప్రజలకు కష్టాలు ఎక్కువగుచున్నవి. అందుచే స్వదేశంలో హిట్లరుకి పోరు ఎక్కువగును.

**బ్రహ్మాండమగు విమానదాడి.**

గత శనివారం వెన్నెల రాత్రిలో వేయి బ్రిటిషు బాంబరు విమానాలు జర్మనీవారివగు రూరురైనులం డులందున్న పరిశ్రామిక నగరాలపైని కొలోనుపట్టణంపైని జరిపిన దాడితో విమాన యుద్ధం క్రొత్తరూపం దాల్చింది. ఇంగ్లాండుపై యిదివరకు మహా యెక్కువగా ఒక్కసారి వస్తే 500 విమానాలు వచ్చేయేమోకాని జర్మనీపై యిపుడు 1,000 విమానాలు వెళ్లేయి. జర్మను ప్రజలు దయదల్చమని బ్రతిమాలుకొనేటంత తీవ్రదాడి జరిగింది. వేలకొలది ప్రజలు యిండ్లులేక మాడుచున్నారు, గొప్పవారు తండోపతండాలుగా పారిపోతున్నారు. రైనులండ ప్రజల ధైర్యం దీనితో చెడిపోతుంది. ఇటువంటి దాడులు ప్రతిదినం జరిగితే జర్మనీకి యుద్ధభీతి బాగా కలుగగలదు. కొలోనుపై దాడిలో చాల నష్టం కలిగిందని జర్మనీవే అంగీకరించెను. 3,000 టన్నుల బాంబులు ఆ నగరంపై పడెను. జర్మను విమానాలు ఎన్నడు ఇంగ్లాండుపై యింత తీవ్రమగు దాడి చేయలేదు.

ఈ దాడి ప్రపంచ దృష్టినంతా ఆకర్షించినంత బ్రహ్మాండమయినది, ఇకముందు యింతకన్న తీవ్రమగు దాడి చేస్తామని విమానదళాధికారి సర్ ఆర్చిబాల్డు సింక్లరుగారు నుడివిరి. నాల్గు సంఖ్యలుగల విమానదళంతో బ్రిటిషువారు రెండో దాడికూడ అపుడే ఎస్సెను నగరంపై చేసిరి. ఇచట జర్మనీయొక్క సుప్రసిద్ధమయిన క్రుప్పు ఇనుము కర్మాగారముంది. ఇది హిట్లరు యుద్ధ పరిశ్రమకు ప్రాణంవంటిది. "ఒక నగరం తరవాత నింకోటి"—కొడుతూనేవుంటాం అని చర్చిలు ప్రధాని కొలోనుదాడి తదనంతరం జర్మనులను హెచ్చరించెను. నాలుగువేల వరకుగూడ ఒకేసారి విమానాలను జర్మనీపై పంపగలమని ఒక ప్రధానోద్యోగి నుడివెను.

"ఈ దాడులలో త్వరలో అమెరికా విమానదళంకూడ మనకు కలియును" అని చర్చిలు ప్రధాని మంగళవారం కామన్సు సభలో చెప్పెను. రాయలు విమానదళం, అమెరికా విమానదళం జర్మనీలో నొకచోట నివాస మేర్పరచుకోగలవు, దానిబట్టి ముందు గతేమో సూచనగ జర్మను ప్రజలకు తెలియగలదు.



బ్రిటిషు యువతులు మిలిటరీ మోటారు లారీలు నడపుట నేర్చుకొనుట. అదివరకీమె చాకలిపని చేసేది.

---

# లిబియా యుద్ధం.

## కామన్సు సభలో చర్చిలు ప్రసంగం.

టొబ్రుకు యుద్ధం యింకను ముగియలేదు—భారతీయ సైనికుల ప్రశంస.

బ్రిటిషు కామన్సు సభలో మంగళవారం నాడు చర్చిలుగారు ప్రసంగించుచు, లిబియాలో టొబ్రుకు నగరమును పట్టుకొనుటకు జర్మనులు గొప్ప టాంకుల దళములను పంపి చేసిన ప్రయత్నము విఫలమయినదని వివరించిరి. జర్మనీలో యుద్ధ పరిశ్రమలను నాశనము చేయుటకు రోజునకు వెయ్యి విమానాలు పంపి దాడిచేయుచున్నాయనియు, వాటికి తోడుగ అమెరికా విమానాలుకూడ త్వరగా రాగలవనియు, చర్చిలుగారు తెలిపిరి. లిబియా యుద్ధంగూర్చి అచటి బ్రిటిషు సర్వ సేనాని సర్ అచినులేకుగారు పంపిన ప్రకటన సభలో చదివిరి.

లిబియాలో టొబ్రుకు రేవునగరం యిదివరకు ఎన్నో నెలల జర్మను సేనల ముట్టడికి నిలచి, చివరకు వారిని తరిమివేయగల్గెను. ఇపుడు జర్మను సేనానియగు రోమెలుగారు దాన్ని వశపరచుకోవాలని మరల ఘట్టి ప్రయత్నముచేసెను. ఈ యుద్ధం యింకను జరుగుచున్నది. ఆఖరు ఫలితమెట్లున్నను ఇంతవరకు రోమెలుగారి ప్రథమ ప్రయత్నం విఫలమయినదని చర్చిలుగారు తెలిపిరి. టొబ్రుకును పట్టుకొనుటయు, బ్రిటిషు టాంకుల విధ్వంస మొనరించుటయు జర్మను సేనలయొక్క విజృంభణమునకు ముఖ్యోద్దేశములని, పట్టుబడిన జర్మను ఖైదీలవద్ద దొరికిన పత్రముల ద్వారా తెలిసెను.

మే 27 వ తేదిన రోమెలుగారు జర్మను ఇటాలియను సేనలు టాంకు దళములను ఎక్కువగతెచ్చి టొబ్రుకుపై దాడికి పురికొల్పెను. (1)

బీర్ హాకీమును పట్టుకొనుట, (2) దానికి దక్షిణం వైపుగా చుట్టుకొని టొబ్రుకు వంకకు పోవుట, (3) కోస్తాలోనున్న గజాల పట్టణమునుండి కొంచెం దక్షిణంగావచ్చి తాపుజోపోవు రోడును కలసికొనుట—ఈ మూడు కార్యములు సాధించుటకు రోమెలుగారు జర్మనుల ఆఫ్రికా టాంకు దళములు రెండింటిని, ఇటాలియను టాంకు దళములు మూడింటిని, మోటారు దళములను కలపి విశేష సైన్యమును పంపెను. కాని మొదట యత్నమునందే బీర్ హాకీమువద్ద స్వతంత్ర ఫ్రెంచి సైన్యం జర్మను సేనను ఓడించుటచే అది బీరు హాకీం దాటలేకపోయెను.

శత్రువుల రెండవకార్యం విఫలమగుటకు భారతీయ సేన కొంత తోడ్పడెను. జర్మను ఆఫ్రికా కోరు సేన బీరుహాకీము పురమును చుట్టుకొని ఉత్తరమువైపు టొబ్రుకు దగ్గర అక్రోమా వరకు పోయెను. బ్రిటిషు సేనలు ఎల్‌డూడాసి, దిరిబెకులందు జర్మనుసేనల నెదుర్కొన్నవి. టొబ్రుకులోనున్న బ్రిటిషు సేనకు, అక్రోమాకు అవతల పశ్చిమమున యున్న బ్రిటిషుపక్ష సేనలకు సంబంధంలేకుండా జర్మను సేనలు చేయలేకపోయినవి. బీరుహాకీము తూర్పున శత్రుసేన దాడియొక్క తీవ్రతనంతా 3 వ భారతీయ కవచపు మోటారుదళమే భరించెను. ఈ దళము జర్మనుల ఫిరంగిగుండ్ల నెదిరించి కొంతకాలం జర్మనుసేన ముందికిపోకుండ ఆటంకపరచెను. మితిమీరిన శత్రుబలం వచ్చే వరకు నిరోధించెను.

గజాలావద్ద దక్షిణంగానున్న బ్రిటిషు సేనపై శత్రు సేనలు 27 వ తేదీన దాడి ప్రారంభించినవి. కాని దక్షిణాఫ్రికా సైనికదళం, తీవ్రనిరోధం కావించి, శత్రు సేనలు గజాలానుచుట్టి టోబ్రూకు వంకకు పోకుండా ఆటంకపరచి, వారి మూడవ కార్యం విఫల మొనర్చినది.

ఈ మూడు మార్గములను టొబ్రుకుపై ముట్టడిచేయదలచుటేగాక, సముద్రమార్గమున పడవలలోవచ్చి టొబ్రుకువంకకు దక్షిణంగా వచ్చుచున్న టాంకు దళములను చేరవలెనని జర్మనులు 26 వ తేదీ రాత్రి ప్రయత్నించిరి. కాని బ్రిటిషు యుద్ధ నావలు అనేక పడవలను ధ్వంసం చేసినవి.

అక్రోమానుండి 40 మైళ్ల దక్షిణముననున్న బీర్‌హాకీమువరకును, ఎల్‌అదెమునుండి 30 మైళ్ల పడమర బ్రిటిషువారు మందుగనులు వేసిన ప్రదేశంవరకును, ఏకాండంగా యుద్ధం జరుగుచున్నది. ఈ మధ్యభాగంలో జర్మను టాంకు దళములు చిక్కుపడినవి. అవి దక్షిణమున ఒక చోట మందుగనులను భేదించుకొని కొన్ని జర్మను టాంకులు వెడలిపోయినవి. కాని వీలయినంత వరకు వారు తప్పించుకపోకుండ బ్రిటిషు కాల్బలము కాపాడుచున్నది. మన విమానాలు గుంపులుగావచ్చి వారికి సహాయంచేయుచు వరుసగ మూడు రోజులు విరామంలేకుండా శత్రుసేనలపై బాంబులు వేసినవి.

ఇంతవరకు 260 శత్రువుల టాంకు బ్రిటిషు వారి వశమగుటో నాశనమగుటో జరిగెను. సైనిక రవానా మోటారులు యింతకన్న యెక్కువే శత్రువు నష్టపోయెను. యుద్ధం ప్రారంభమయిన మే 26 వ తేదీకి ఆరు రోజులు ముందునుండిగూడ బ్రిటిషు విమానాలు గుమిగూడియున్న శత్రుసేనలపై బాంబులు వేయుచుండెను.

బ్రిటిషువారి టాంకులుకూడ అనేకం శిధిలమయ్యెను. కాని యుద్ధరంగం బ్రిటిషువారి చేతులోనే యుండుటచేత వాటిని తిరిగి బాగు చేసుకోగలరు. జర్మనులు అట్లు చేయలేరు. టొబ్రూకు యుద్ధం యింకను ముగియలేదని చర్చిలుగారు తెలిపిరి.

జర్మనీ పరిశ్రామిక నగరమగు కోలోనుపై విమానదాడిగూర్చి ఏస్సేనుపై దాడిగూర్చి ప్రధాని తెల్పుచు, ప్రతిరోజు 1,000 విమానాలు పంపుతామనుకోరాదనియు, త్వరలో అమెరికా విమాన దళం సహాయం రాగలదన్నియు, అపుడు యింకా యెక్కువ పంపగల మనియు, ఏస్సేనుపోయిన 1,036 లో 35 మాత్రం తిరిగి రాలేదనియు, యీదాడులవల్ల జర్మను నగరాలలో విశేషనష్టం కలిగిందనియు చెప్పిరి.

# సమర సరసం !

ఇంగ్లాండుమీద జర్మనీ కత్తికట్టి యుద్ధానికి దిగినప్పటినుంచీ, జర్మనీ ఒకవిధమైన అహంభావంతో ఉంటున్నది. బ్రిటిష్ ప్రధానమంత్రియైన చర్చిల్లుగారు ఓర్పుతో కష్టాలు ఓర్చుకోవలెనని హెచ్చరిస్తూ ఉన్నారు. ఎన్ని బాంబులు శత్రువు వేసినా, ఇంకా ఓర్చుకోవలసినదే అని ప్రజలను హెచ్చరిస్తూ వచ్చారు. అటువంటి కష్టకాలం చిరకాలం ఉండదు అనిన్నీ, మనకు కూడా మంచి రోజులు త్వరలోనే రాగలవనిన్నీ ఆయన చెప్పుతూ వచ్చాడు. జర్మనీకి ఉన్న అహంభావ మేమిటయ్యా అంటే !—"నాకు ఉన్నన్ని విమానాలు ఇంకెవరికీ లేవు" అనే అహంకారమే హిట్లరును యీ యుద్ధంలోకి దింపింది. అనేక సంవత్సరాలనుంచీ ఏకదీక్షగా విమానాలు నిర్మించాడు. వాని నన్నింటినీ నిల్వ చేసుకొన్నాడు. ఈ విమానాలు నడిపించుటకు సమర్థులైన వైమానికులనుకూడా తర్ఫీయతు చేసికొని వుంచాడు. కొన్ని లక్షలకొలదిగా బాంబులు కూడా తయారుచేసి వుంచుకొన్నాడు. ఈ విధంగా యివన్నీ తయారుచేసుకొన్నాడు. ఇక మనముందు యీ విమానబలంలో ఎదురు జవాబు చెప్పగలవా డెవడూ లేడురా ఈ పదునాల్గు లోకాలలోనూ అనే అహంకారంతో కత్తి పైకెత్తి, ఇంగ్లాండుమీదనే సవాలు చేసాడు.

జర్మనీవారు యుద్ధం ప్రారంభించిన రోజున ఇంగ్లాండులో విమానబలము నామమాత్రంగా ఉంది. జర్మనీయొక్క విమానాలకు బ్రిటిష్‌వారు ఎదురు జవాబు చెప్పలేరు గదా అనే అహంకారంతో జర్మను విమానాలు ప్రారంభదశలో ఇంగ్లాండుమీదకు తరచుగా దాడివెడలి, ఇంగ్లాండులోని అనేక పట్టణములమీద బాంబులువేసి వేలకొలది జనాన్నీ, వారి యిండ్లనూ నాశనం చేసినవి. జర్మను విమానాలు మొదట్లో వందలు వేలుగా ఇంగ్లాండుమీదకు వచ్చి అగ్నివర్షం కురిపించాయి. అప్పట్లో బ్రిటిష్‌వారు అందుకు ప్రతీకారంగా కొద్ది సంఖ్యగా తమ విమానములను జర్మనీలోని విమానాలఫ్యాక్టరీలమీద బాంబులు వేయుటకై పంపించారు. ఇంగ్లాండుమీదకు జర్మనీవాళ్లు పంపించినంత అధికసంఖ్యగా మాత్రం బ్రిటిష్‌వారు తమ విమానాలను జర్మనీమీదకు పంపించలేదు, కాని "ఎల్లకాలం ఇటువంటి అసహాయ స్థితిలో ఉండము" అని చర్చిల్లుగారు అంటూనే ఉన్నారు. మనము జర్మనీమీద కొట్టేదెబ్బ "వెన్నెముక విరిగేటట్లు కొడ్తాము" అని అన్నారు.

ఒక్క విషయం బాగా ఆలోచించాలి. ఇంగ్లాండుమీద బాంబులు వెయ్యవలెనని బయలుదేరి వచ్చేటటువంటి జర్మనువిమానాలు ఇంగ్లాండు కోస్తాకు ఎదురుగా సమీపంలోఉన్న ఫ్రెంచి కోస్తానుంచి బయలుదేరి పోగలవు. ఇంగ్లాండుకు 100 మైళ్ల దూరంలో స్థావర మేర్పరచుకొని, ఆ మకామునుంచి బాంబులు ఎక్కించుకొని జర్మనువిమానాలు ఇంగ్లాండుమీదకు అరగంటలో వెళ్లి ఆ బాంబులువేసి తిరిగి మకాముకు వచ్చి పెట్రోలు ఎక్కించుకొని మరికొన్ని బాంబులను ఎక్కించుకొని, తిరిగి ఇంకొక అరగంటలో ఇంగ్లాండుమీదకు వెళ్లి ఆ బాంబులనువేసి, అతిశీఘ్రంగా వస్తూపోతూ ఉండగలవు. జర్మను విమానాలకు కావలసిన విమానాశ్రయాలు ఇంగ్లాండుకు చాలా సమీపంలోనే ఉండడంవల్ల, జర్మను విమాన దండయాత్రలు ఇంగ్లాండుమీద అతి సులభంగా అతిశీఘ్రంగా సాగిస్తూ ఉండవచ్చును. కాని, జర్మను విమానాలు లండనుమీదకు దండెత్తి వచ్చినట్లుగానే, బ్రిటిష్ విమానాలు బర్లిను నగరం మీదకు దండెత్తి రావలెనంటే ఇంగ్లాండు కోస్తానుంచి బయలుదేరిన విమానాలు 700 మైళ్లు మూడు గంటలు ప్రయాణంచేసి బర్లినుమీదకు వచ్చి, బాంబులు వేసి, తిరిగి మూడు గంటలు ప్రయాణంచేసి ఇంగ్లాండుకు చేరాలి. రానూ పోనూ 1,400 మైళ్లు 6 లేక 7 గంటలసేపు

ప్రయాణం చెయ్యాలి. ఈ మధ్యకాలంలో పెట్రోలు ఎక్కించుకొనుటకు మధ్య మకాములు ఉండవు. కనుక ఒక్కసారిగా పెట్రోలు ఎక్కించుకొని అతి దూరప్రయాణం ఏకథాటీని చేసి రాగల పెద్ద విమానాలు, కొన్ని టన్నుల బాంబుల బరువుతో సహా వెళ్లిరాగల పెద్ద విమానాలు, నాలుగు యింజన్లుగలవి కావాలి. అటువంటి విమానాలు చాలా ఖరీదుగలవి. ఇటువంటి బ్రహ్మాండమైన దూరథాటీ విమానాలను తయారు చెయ్యడం వ్యయప్రయాసలతో కూడినపని, అటువంటిది ఒక్కటి నష్టమైనా చాలా పెద్ద నష్టముగా లెక్క చూచుకోవాలి. సామాన్య విమానానికంటె రెండింతలు మూడింతలు నష్టముగా లెక్కచూచుకోవాలి. అట్లయినప్పటికీ, అటువంటి దూరథాటీ బాంబు విమానాలనుకూడా బ్రిటిష్‌వారు జర్మనీలోని బర్లిను నగరంమీద బాంబులు వెయ్యడానికి పంపించారు. ఈ విధంగా ఆలోచిస్తే ఇంగ్లాండుమీద జర్మనీవాళ్లు విమానదాడి నడిపించడం సులభమనిన్నీ, జర్మనీమీద బ్రిటిష్‌వారు బ్రహ్మాండంగా విమానదాడి నడిపించడం కష్టమనిన్నీ, జర్మను విమానదాడులలో ఉన్న సౌకర్యం, బ్రిటిష్ విమానదాడులలో లేదనిన్నీ ఒప్పుకోవాలి.

కాని, ఇంకో పెద్దవిషయం ఆలోచించవలసియున్నది. జర్మనులు తయారుచేసే విమానాలన్నీ జర్మనీలోనే జర్మను విమాన ఫ్యాక్టరీలలోనే ఎక్కువగా తయారుచేస్తున్నారు. ఈ జర్మను విమాన ఫ్యాక్టరీలు జర్మనీలోని పశ్చిమ ప్రాంతంలో, ఇనుము గనులు, బొగ్గు గనులు సమృద్ధిగా ఉన్నటువంటి రూరు పరగణాలోను, రైనులాండు పరగణాలోను ఉన్నాయి. ఈ జర్మను పరగణాలు ఇంగ్లాండుకు విశేష దూరంలో లేవు. బర్లిను నగరమంతదూరంలో లేవు. ఈ జర్మను విమాన ఫ్యాక్టరీలను ధ్వంసం చేసినట్లయితే, జర్మనీకి విమానాల సప్లయి తప్పకుండా క్షీణిస్తుంది. ఈ విమానాల ఫ్యాక్టరీలు ఉన్నట్టి ప్రాంతం జర్మనీకి వెన్నెముకవంటిది. ఈ వెన్నెముకమీద దెబ్బ కొట్టితే జర్మనీకి తల ప్రాణం తోకకు వస్తుంది. కాని, బ్రిటిష్‌వారికి కావలసిన విమానాలన్నీ మూడు ముప్పాతికభాగం అమెరికాలోని విమాన ఫ్యాక్టరీలలో తయారై ఇంగ్లాండుకు సప్లయి చేయబడుచున్నవి. జర్మనీ నుంచి విమానాలు అట్లాంటిక్కు మహాసముద్రం దాటి వెళ్లి నాలుగువేల మైళ్ల దూరంలో ఉన్న అమెరికను విమానాల ఫ్యాక్టరీలమీద బాంబులు వేసిరాలేవు. ఇది అసంభవం. అసాధ్యం. కనుక యీ విధంగా జర్మను విమానోత్పత్తిని ధ్వంసం చెయ్యడానికి బ్రిటిష్‌వారికి సౌకర్య సదుపాయం ఉన్నట్లుగా, బ్రిటిష్ విమాన సప్లయిలను క్షీణింపజేయుటకు జర్మనీవాళ్లకు సౌకర్యావకాశం లేదు. జర్మనీకి విమానాలు సప్లయిచేసే జర్మను విమాన ఫ్యాక్టరీలమీద బ్రిటిష్ విమానాలు బాంబులువేసి నాశనం చేయగలవు. కాని, బ్రిటిష్‌వారికి విమానాలు సప్లయిచేసే అమెరికను విమానాల ఫ్యాక్టరీలమీద జర్మనులు బాంబులు వేయజాలరు. బ్రిటిష్ విమానాల సప్లయి అంతకంతకు వృద్ధి అవుతూ ఉంటే, జర్మను విమాన సప్లయి అంతకంతకు క్షీణించగలదు. ఇప్పుడు రష్యాతో ఒక వైపున నెలలకొలదిగా, బ్రహ్మాండంగా హిట్లరు తన విమానబలమంతా ప్రయోగించి యుద్ధం చేస్తూఉంటే, ఇదే సమయం అని చెప్పి బ్రిటిష్‌వారు, జర్మనీమీదకు బ్రిటిష్ విమానదాడి బ్రహ్మాండంగా సాగిస్తున్నారు. ఇటు బ్రిటిష్ విమానాలకు ఎదురు జవాబు చెప్పడానికి తగినన్ని జర్మను విమానాలు రావాలంటే రష్యా యుద్ధ రంగంలో జర్మను విమానబలం తగ్గుతుంది. ఈవిధంగా మంచి ముహూర్తంలో 1,000 బ్రిటిష్ విమానాలు, "సహస్రశీర్షా పురుషః" అని మంత్రపుష్పం సాగించారు. పూలబంతుల ఆటలాగున జర్మనీ మీదకు, ఇంగ్లాండు మీదకు పరస్పర విమానదాడులు సాగుతున్నాయి. కాని, జర్మనీ "తమలపాకుతో తానొకటంటే, ఇంగ్లాండు తలుపుచెక్కతో నేరెండంటీ!" అన్నట్లుగా దెబ్బ తీస్తున్నది.

ఈ సమర సరసం ఎట్లాఉందో చూడండి. చివరకు ఎవరు గెలుస్తారో ఎవరిది పైచెయ్యి అవుతుందో బాగా ఆలోచించండి.

# కొరియాలో నిర్బంధ సైనికసేవ.

కొరియాలో నిర్బంధంగా సైనికసేవ చేయించడం 1944 లో ప్రారంభమగునని జపాను ప్రభుత్వం ప్రకటించింది. కొరియా జపాను వశమందున్న ఏషియాఖండంలోని ద్వీపకల్పం. ఈ రాష్ట్రంవారికి జపానుపై ఉన్నంత ద్వేషం ఏషియాలోని యింకే రాష్ట్రవాసులకు లేదు. ఇక్కడనుండికూడ నిర్బంధంగా సైనికులను చేర్చుకుంటున్నారంటే జపానుకి సైన్యం ఎంత చాలకుండావుందో తెలియగలదు. కొరియనులకు జపానంటే ద్వేషం కావున, వారిని జపాను సైన్యంలో చేరమని కోరుట చాలకష్టం. సమర్దులగు కొరియను లందరిని సైన్యంలో కూలీలుగా చేర నిర్బంధించి, వారిపై దిట్టమైన కాపలా జపాను ప్రభుత్వం ఉంచగలదు.

ఇట్లా నిర్బంధంగా సైన్యాన్ని చేర్చుకోడమే ఒకవేళ జరిగిందంటే, ఆ సైన్యాన్ని ఏమాత్రం నమ్మడానికి వీలుండదు. కొరియనులను జపాను చాల హింసించింది కనుక వారికి జపానంటే కిట్టదు. ఏనాడు తిరిగి స్వాతంత్ర్యం పొందు తామా అని వారు ఎదురుచూస్తున్నారు. కావున ఆ సైన్యం మనస్ఫూర్తిగ జపానుతరఫున యుద్ధం చేయదు.

---

# నేషనలు వారు ఫ్రంటు.

## స్టాదంగారి విన్నపం.

మదరాసు విద్యాశాఖ డైరక్టరు ఆర్. ఎం. స్టాదం, ఎం.ఎ., సి.ఐ.ఇ., ఐ.ఇ.ఎస్., గారు యిట్లు సందేశ మంపిరి:—

విద్యాశాఖకు చెందినవారు, ఉపాధ్యాయులు, విద్యార్థులు వారి తలిదండ్రులు అందరు నేషనలు వారు ఫ్రంటు (జాతీయ యుద్ధరంగం) ఉద్యమము నందు చేరెదరని ఆశించుచున్నాను. ఈ ఉద్యమంలో అనేకం పనులు చేయవలసియున్నవి. కాని నా కందు ఒక్కటే ముఖ్యంగా కనబడుచున్నది—శత్రు దాడినుండి దక్షిణ ఇండియాలో స్త్రీలను, బిడ్డలను రక్షించుటకు తోడ్పడుట.

గత ఆరు నెలలలో విద్యాలయములందున్న లక్షలకొలది విద్యార్థులను బిడ్డల రక్షించుటగూర్చి చాల ఆందోళన పడితిమి. అందరు బాలబాలికలకు మంచి విద్య అలవడచేయుట పవిత్రమయిన విధిగా తలంచుచుంటిని. ఇపుడు నేషనలు వారు ఫ్రంటులో చేరినందున యీ 35 లక్షల బిడ్డలను శాంతియుతంగా భద్రంగా కాపాడడమే మన ప్రధాన కర్తవ్యంగా నెంచుచున్నాను.

నేషనలు వారు ఫ్రంటులో చేరుటకు ఎన్నో కారణాలు యుండవచ్చును. కాని ఒక్కటే ముఖ్యమయినది. ప్రమాదసమయములందు యువకుల విద్యతో సంబంధంగల స్త్రీగాని పురుషుడుగాని స్త్రీలను బిడ్డలను రక్షించి భద్రపరచుటకు తాను చేయదలచిన పని చేయకుండా యుండరాదు. మనలో చాలమంది వారికి యీ కార్యమునందు స్వయంగా తోడ్పడ కలిగియున్నాము. ఈ వుద్యమంలో చేరితే, మన దేశ రక్షణ భారం వహించినవారందరికి మనం, మనమున్న ప్రాంతంలో, తోడ్పడుటకు సిద్ధంగా నున్నామని తెలిపి నైతిక సహాయం సూచించినట్లగును. యుద్ధంవలన స్త్రీలకు బిడ్డలకు కలిగే ఘోరమగు కష్టాలు తప్పించుటకు స్థిరసంకల్పం ప్రకటించిన వార మవుతాము,

బిడ్డల క్షేమంకొరకు పాటుబడే మనకు సాధారణంగా వివాదాలు తగవులతో సంబంధం ఉండదు. అందులో ప్రస్తుత సమయమున మన యువజనుల భావిసౌఖ్య సంపదలగూర్చియే మనకు ఎక్కువ ఆందోళనగ యుండును. కావున యీ విన్నపము నాద్వారా విన్నవారుగాని, యిటీవల గవర్నరుగారు మనసు కరిగేటట్లు విన్నవించినట్లు నాకన్న సమర్థులు విన్నివించినపుడుగాని, బిడ్డలయందు ప్రేమగల ప్రతివారును, ఏ జాతికి చెందినా సరే, స్త్రీలను రక్షించే సమర్థత గల ప్రతి పురుషుడును, యీ విన్నపం ఆలించి, నేషనలు వారు ఫ్రంటులో చేరెదరని నమ్ముచున్నాను.

# జపానుపై అమెరికను విమానాల దాడి.

## విమాన నిర్మాణ కేంద్రంపై బాంబులు.

జపాను నగరాలపై అమెరికను విమానాలు దాడిచేసిన వివరములు యిపుడు బాగుగ తెలియ వచ్చెను. ఈ దాడి పట్టపగలు చాల దిగువగ ఎగురు విమానాలు జరిపినవి. ఇంతవరకు ఆకస్మికంగావచ్చి బాంబులువేయడం ఒక్క జపాను వైమానికులకు తెలిసిన విద్యయనియే ఎంచబడుచుండెను. కాని యిపుడు అమెరికను వైమానికులుగూడ ఆపని చేయుచున్నారు. టోకియో నగరం దక్షిణమునందు నౌకా నిర్మాణం జరుగుచున్న ఒక రేవులో క్రొత్త యుద్ధ నౌకపై సూటిగా నౌక బాంబు పడినది.

ఇంకో ముఖ్యవిషయం, బ్రిగాడియరు డూలిటిలుగారు తెలిపిందేమిటంటే, నాగోయా నగరంలో ¼ మైలు పొడవునగల విమాన నిర్మాణ కర్మాగారముపై అంతటా మంటల బాంబులు వేయబడినవనిరి. ఇది నిజంగా మిత్సుబుషి అను బ్రహ్మాండమగు కంపెనీయొక్క యంత్రాగారమే అయియుండును. ఇచట ఫైటరు విమానాలు బాంబరు విమానాల భాగాలు జతకూర్చబడుచుండును.

జపానులో విమానాల నిర్మాణం ఒక్కచోట పూర్తిగ జరుగదు. వివిధ భాగాలు వేరువేరు చోట్ల తయారుచేయించి ఒకచోట తెచ్చి అతికి విమానరూపం చేస్తారు. అందువల్ల అవి ఘట్టిగా నుండవు. జపాను దీవులలో ముఖ్యమగు పెద్ద దీవియందు 21 చోట్ల ప్రభుత్వంవారి తనిఖీక్రింద వివిధ ఫ్యాక్టరీలు కలవు. అవి వేరువేరు విమాన భాగాలను తయారుచేసి పంపుచుండును— చక్రాలు, మోటారులు, రెక్కలు, వడితెలిపే జీరు మున్నగు భాగాలు వేరువేరుగా తయారగును. అవన్ని మిత్సుబుషి యంత్రాగారానికి, నాగోయానగరం వెలుపలనున్నదానికి చేరును. అచట విమానం అతకడం పూర్తియగును.

కావున నాగోయాపై బాంబులు పడినవంటే కలిగిన నష్టం ఎటువంటిదో సులభంగా తెలుసుకోవచ్చును. తయారయివచ్చిన యంత్రభాగాలు పోయినాయంటే, విమానాల ఉత్పత్తి ఎంతో మందగించును. అసలు జపానులో విమానాలు తయారుచేయుట యితర దేశాలకన్న మందంగా జరుగును. అమెరికాలో 8½ నిముసాలకో విమానం చొప్పున తయారవుతూవుంటే, జపానులో 1½ గంటలకో విమానం తయారవుతున్నది. అలావున్నపుడు ముఖ్య కర్మాగారంపై బాంబులు పడి చెడిందంటే యింక చెప్పాలి ?

అమెరికా చేసిన విమానదాడివలన జపానుకి చాల నష్టం కలిగినది.